


చెన్నపట్టణము, నవంబరు ౧౯౨౪

సంపుటము ౧. రక్తాక్షి సంవత్సరము కార్తికమాసము సంఖ్య ౧౧.


# ఆంధ్రకవిత్వ చరిత్రము


భోగరాజు నారాయణమూర్తి గారు


## VII

### యుగవిభాగము

సాంఘికచరిత్రములును వాఙ్మయచరిత్రములును దేశచరిత్రములోనివిభాగములు. దేశముతో సంబంధించిన రాజ్యాంగ విషయములు మాత్రమే కాక, తత్ప్రజల యాచారవ్యవహారాదులును భాషావిశేషములును సంపూర్ణముగఁ దెలిసికొనినప్పుడుగాని దేశ చరిత్రమును వ్రాయుటకుఁ బ్రయత్నింపరాదు. ప్రయత్నించిన యెడల నది సంపూర్ణమైన చారిత్రక గ్రంథ మనిపించుకొనఁ బడదు. రాయలనాఁటి యాంధ్రదేశ చరిత్రమును వ్రాయుటకుఁ బూనుకొనినయెడలఁ గేవలమును వాని దిగ్విజయాదిరాజ్యాంగ ప్రసంగములను మాత్రమే కాక, యప్పటి సాంఘిక విషయములును, రాయలభాషాభిమానమును, దత్కాలమునందలి వాఙ్మయ చరిత్రమును గూడ వానితోఁ జేర్చినయెడల నప్పుడు సంపూర్ణమైన దేశచరిత్రముగా నది భావింపఁబడును. ఒకానొక దేశమునందలి వాఙ్మయస్థితినిబట్టి ప్రజలనాగరకతయు నిట్టిదని నిరూపింపవచ్చును. వాఙ్మయము వృద్ధిచెందు

కొలఁది నాగరకతయుఁ బెంపు వహించుచుండును. అందుచే సాంఘికసారస్వతచరిత్రములు దేశచరిత్రములోని విభాగములుగా నెన్నఁగొనఁ బడుచున్నవి. ఇట్లు రాజకీయసాంఘికవాఙ్మయములనుముఖ్యమైనమూఁడుభాగములును, అవసరమైన యంతర్విభాగములతోఁ బ్రత్యేకగ్రంథములుగాఁగాని, యేకగ్రంథముగాఁగాని రచింపఁబడినయెడ మొత్తముపై సంపూర్ణమైన దేశచరిత్రమును మనము తెలిసికొనఁగలము. దేశచరిత్రములో నొకభాగమైన రాజ్యాంగచరిత్రమునుమాత్రమే చరిత్రకారులు వ్రాయుచువచ్చిరి గాని, సాంఘికచరిత్రములును, వాఙ్మయచరిత్రములును విపులముగ వ్రాయకుండుటచేత మన కింకను సంపూర్ణమైన యాంధ్రదేశచరిత్రము లభింపలేదని చెప్పవచ్చును.

### యుగవిభాగావశ్యకత

చరిత్రకారులు హిందూదేశపురాజ్యాంగచరిత్రమును హిందూయుగమనియు, మహమ్మదీయ యుగమనియు, మహారాష్ట్రయుగమనియు, నాంగ్లేయయుగమనియు, నాలుగంతర్విభాగములుగా భాగించినారు. ఈయుగవిభాగమే యాగ్రంథ మెన్నియో శతాబ్దముల చరిత్రముగాని నిన్న మొన్నటి వృత్తాంతము గాదని చెప్పక చెప్పుచున్నది. ఇట్లే నన్నయ మొదలు నేఁటివరకు నించుమించుగఁ దొమ్మిది శతాబ్దముల కాలపరిమితిగల యాంధ్రకవిత్వచరిత్రమును వ్రాయుచో మనకును యుగవిభాగ మవసరమని తోఁచుచున్నది. మఱియు మీఁదఁ జెప్పిన హిందూ మహమ్మదీయాది యుగవిభాగమునుబట్టి మనదేశ మొక్కొక్క కాలమున నొక్కొక్కజాతివారిచేఁ బరిపాలింపఁబడుచు వచ్చినదని సూక్ష్మముగఁ దెలిసికొనఁగలుగుచున్నాము. ఇట్టి జాతిభేదము లేక నాఁటినుండి నేఁటివఱకును హిందూదేశ మొక్కజాతి ప్రభుత్వముక్రిందనే పరిపాలింపఁబడుచు వచ్చియుండినయెడలఁ జరిత్రకారులు తమచారిత్రక గ్రంథవిషయవిభాగమును మఱియొకవిధముగఁ గావించియుందురు. పదునొకండవ శతాబ్దము మొదలుగ నిరువదియవ శతాబ్దమువఱకును నాఁటి నన్నయకవిత్వమే వ్యాపించుచువచ్చి యుండినయెడల మనకును నియ్యుగవిభాగ మవసరముకాకపోయి యుండును. కాని, యిన్నిశతాబ్దములవఱకు నొకజాతి ప్రభుత్వముక్రిందనే పరిపాలింపఁబడుచుండుటయు నొకజాతి కవితారచనయే కావింపఁబడుచుండుటయు నేదేశమునందును సంభవింపనేరదు.

ఒకదేశమునందలి ప్రభుత్వము పెక్కుమార్పులు చెందుచు వచ్చెనని రాజ్యాంగచరిత్రకారుఁడు వ్రాసిపెట్టినప్పుడు, తద్దేశమునందలి వాఙ్మయముసైతము పెక్కుమార్పులు చెందియుండునని కవిత్వచరిత్రకారుఁడు గ్రహింపవలసినదే. ఇంతియేకాక కావ్యరచనయందుఁ గవి తన్నును దనదేశమును దనసంఘమును మఱుగుపరచుట కెప్పుడును బ్రయత్నింపఁడు. అందుచేఁ గావ్యదర్పణమునం దొక్కకవినేకాక, కవికాలమునాఁటి పలువిధములగు నితరవిషయములను మనము తెలిసికొనఁ గలుగుచున్నాము. ప్రభుత్వము

మారినప్పుడు కరిపాలనమునఁ గొంత భేద ముండకపోదు. పరిపాలనము భేదించినప్పుడు ప్రజలయందును గొంత నూతనత్వము గలుగక తప్పదు. ప్రజలలో నూతనత్వ కనుచో వారిలో నొకఁడైన కవియందును నది సంక్రమింపకయుండదు. కవియందుఁ గలిగిన నూతనత్వము వానికావ్యమునందుఁ గానరాకపోదు.

### రాజనరేంద్రుని మతము

నన్నయనాఁటి వాఙ్మయముతోఁ దత్పూర్వవాఙ్మయమును సరిపోల్చుటకు విపులమైన యాధారము మనకు లేకపోయినను, రాజరాజు తనపూర్వులవలెఁ దాను జైనమతాభిమానిగాక బ్రాహ్మణమతోద్ధారకుఁ డని యాతఁడు వ్రాయించిన భారతరచనావిధానమును బట్టియే కాక,

"మ. ఇవి యేనున్ సతతంబు నాకును గరం
బిష్టంబు లై యుండుఁ బా
యవు భూదేవకులాభిరత్వరత................"

అని పలికిన పలుకులవలన మఱింత స్పష్టమగుచున్నది. రాజనరేంద్రుఁడిట్లు భిన్నమతస్థుఁడగుట చేతనే, జైనమతానుకూలముగ నదివరకుఁ గన్నడమున రచింపఁబడిన 'పంపాభారతము' నకుఁ బోటీగా నన్నయచే నాంధ్రమహాభారతమును వేదమతానుకూలముగ వ్రాయించెను. రాజరాజు తండ్రియైన విమలాదిత్యుఁడు జైనమతాభిరతుఁడైనట్లును, "త్రికాలయోగి సిద్ధాంతదేవర" యను జైనగురునకు శిష్యుఁడైనట్లును, పూషపాడ సంస్థానములోనిదగు రామతీర్థక్షేత్రము నందలి 'పాండవులపంచ' యను గుహాలోని శాసనమువలనఁ దెలియుచున్నది. ఈ శాసనమాజైనగురు విరచితమైనదే. ఒక్కవంశమునఁ బుట్టిన ప్రభువులయందే మన కింత మతభేదము గానవచ్చుచుండ, జాతిభేదములు గల ప్రభువులపరిపాలనమునం దిట్టిమార్పులు పెక్కులుండుట యొకవింతగాదు. జైనమతస్థుల వాఙ్మయమేమైన మనకు లభించియుండినయెడల మన మీసమస్య నింతకంటె నెక్కుడుగఁ జర్చింపఁగలిగియుందుము.

ఆంధ్రదేశమును గాకతీయచక్రవర్తులు పరిపాలించుచుండిన కాలములోఁగూడ మన సారస్వతమునఁ గొంత మార్పు గానవచ్చుచున్నది. ఆమార్పు ప్రభువులతో సంబంధించినదియేకాని తద్భిన్నమైనది కాదు. కాకతీయ ప్రభువులు శైవమతస్థులు. ఆయుగమున వృద్ధిగాంచినదియు శైవవాఙ్మయమే. ఇట్టి నిదర్శనములు మఱికొన్నియున్నను, "దేశమునందలి ప్రభుత్వమునకును వాఙ్మయమునకును గల పరస్పరసంబంధ" మనునది ప్రత్యేక విషయము (Subject) గాఁ జర్చింపఁదగినదగుటచే నియ్యుగవిభాగ ప్రకరణమున నింతకన్న మనము ముచ్చటింప నవసరములేదు. ప్రభుత్వము తోడనే వాఙ్మయమునకును గొంతమార్పు గలుగుచుండునని సూచించుటయే మన ప్రస్తుతాంశము.

### అజ్ఞాతయుగము

పైని వివరించిన యంశములంబట్టి మన కవిత్వ చరిత్రమునకును యుగవిభాగ మవసరముగాఁ గానవచ్చుచున్నది. అందుచే నన్నయ మొదలు నేఁటివఱకుంగల వాఙ్మయము

నంతటిని నేయేయుగముల క్రింద నెట్లు విభాగింపవలసియున్నదో చర్చింపవలయును. ఈచర్చయొనర్చుటకు ముందు విపులమైన యాధారములు లేకపోయినను నన్నయకుఁ బూర్వ వాఙ్మయచిహ్నములను గొంతవఱకైనఁ బరిశీలింపక విడుచుట న్యాయముగాదు. పదునొకండవ శతాబ్దమునకుఁ బూర్వపువాఙ్మయము మనకుఁ బ్రత్యక్షముగఁ గానరానందున దాని నజ్ఞాతయుగమని చరిత్రకారులు వాడుచున్నారు. ఈ యజ్ఞాతయుగమునఁ గొంతవఱకైనఁ దెనుఁగు వాఙ్మయ ముండి యుండునా? లేదా? ఉండినయెడల దానిస్వరూప మెట్టిది? అట్టి వాఙ్మయమునకుఁ బ్రచారకు లెవ్వరైయుండిరి? అను నీ ప్రశ్నలు 'నన్నయ యాదికవి యగునా కాడా?' యను విద్వద్వివాదములలోఁ గొంతవఱకుఁ జర్చింపఁబడినవి.

ఆఱవ శతాబ్దమునుండియు సత్యాశ్రయుఁడు మొదలగు చాళుక్య ప్రభువు లాంధ్ర వాఙ్మయమునకుఁ బ్రోత్సాహకారులై పని చేసినట్టి నిదర్శనములు గానవచ్చుచున్న వనియు, చాళుక్యచక్రవర్తియగు యుద్ధమల్లుని శాసనమువలనఁగూడ నన్నయకుఁబూర్వము తెనుఁగుకవిత విపులముగ వ్యాపించి యుండినట్లు రూఢియగుచున్నదనియు, వాఙ్మయపరిశోధకు లిదివఱకే కనిపెట్టియున్నారు. రాజనరేంద్రుని సమకాలికుఁడగు భోజరాజునకు "ముద్రామాత్య" మను నొక యాంధ్రకావ్యము క్షేమేంద్రకవిచే నంకితముచేయఁబడి నట్లుగ నాంధ్రులచరిత్రము చెప్పుచున్నది.

ఇవి యిట్లుండ నీక్రిందఁ బేర్కొనఁబడిన శాసనమునుబట్టి యజ్ఞాతయుగములోని తెనుఁగుకవితను గుర్తించుటకుఁ గొంతయవకాశము కలుగవచ్చును.

గుంటూరుజిల్లా కూరపాటితాణా మునిగోడు గ్రామమునందలి శాసనము

"శ్రీశతజనేశ్వరాలయము శ్రీమునిసువ్రత తీర్థకాలము। ధాతి ప్రతిష్ఠ సేసె మునిగోటి వదియ్యజిన ప్రతిష్ఠ వి। ఖ్యాతిగనిల్పె గొంకనృప గట్టెను గైచను బోయగట్టు జీ। బూతపురాట్టహాస వామభట్టి సమానయశోవిరాజియై.

స్వస్తి సర్వలోకాశ్రయ శ్రీవిష్ణువర్ధన మహారాజుల ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సర బులు 3 ఆగు శ్రాహి, శ్రీమన్మహామండలేశ్వర గొంకయమునుగోటి శతజనేశ్వరాలయంబునకు నిచ్చిన గదుగమడి ..........."

సర్వలోకాశ్రయ విష్ణువర్ధనుఁడనుపేరు రాజనరేంద్రునకుఁ బూర్వుఁడైన మొదటి చళుక్యభీమునకుఁ గలదు. అతని శాసనములలో శక సం. 814 అనఁగా క్రీ. శ. 892 వ సంవత్సరములో వ్రాయఁబడిన శాసన మొకటి కలదని 1918 వ సం. మదరాసు ఎపిగ్రాఫీ రిపోర్టులోఁ జెప్పఁబడినది. పై శాసనమునందలి గొంకరాజన కేలికయగు విష్ణువర్ధనుఁ డీవిష్ణువర్ధనుఁడే యైనయెడల నియ్యది నన్నయకుఁ బూర్వము రెండువందల సంవత్సరముల క్రింద వ్రాయఁబడినదియై యుండును. అప్పటికి జైన మత మాంధ్రదేశమున మిక్కిలి ప్రచారములో నుండెను.

చాళుక్య మహారాజులందఱును సర్వ లోకాశ్రయ విష్ణువర్ధనులని వ్రాసికొనుచుండినవారేయయ్యు వీరాదిశాసనము జైనశాసనమగుటచేత నందలి సర్వలోకాశ్రయ విష్ణువర్ధనుఁడు రాజరాజునకుఁ బూర్వులలోని యొకసర్వలోకాశ్రయ విష్ణువర్ధనుఁడై యుండి యుండవలయును.

మఱియుఁ జాళుక్యులకుఁ బూర్వము పల్లవులకాలములోఁ † బల్లవరాజైన 'అత్తివర్మ' వ్రాయించిన శాసనమొకటి గుంటూరుజిల్లాలోని గోరంట్లగ్రామములో నున్నది. ఆశాసనములో 'అంతుకూరు' 'తాంటికొండ' అను తెనుఁగుమాటలు కనఁబడుచున్నవి. పల్లవరాజులు ఆఱవశతాబ్దమునాఁటి చాళుక్యప్రభువులకుఁ బూర్వులగుటచే నీశాసనము నాలవశతాబ్దము నాఁటిదియో యైదవశతాబ్దము నాఁటిదియో యైయుండును. ఇందువలన నన్నయ కైదాఱువందలసంవత్సరములకుఁ బూర్వమునందే తెనుఁగు ప్రచారములోనున్నట్లు చెప్పఁగలము

అజ్ఞాతయుగములోని పద్యరచన

ఇది యిట్లుండ మునిగోటిశాసనములోని తెనుఁగుపద్యమునుగూర్చి కొంత విచారింతము. ఆపద్యములో గీరలుగలచోట్ల ఛందోదోషములున్నవి. వానిని శాసన పరిశోధకానుభవము గలవారే సవరించుట యుత్తమమని యున్నది యున్నట్లు లేయిందుఁ జేర్చితిని. ఛందోభంగముగల మొదటిపాదమునందుఁదప్ప, తక్కినమూఁడు పాదములయందును 'త' ప్రాస కానవచ్చుచుండుటచేత నీపద్యములోని ప్రాసనియమమును గూర్చి సంశయింపవలసినపనిలేదు. కాని యతిమాత్రము 1-3 పాదములయందే కానవచ్చుచున్నది. అందులోఁ బద్యారంభము ఛందోదోషముగలదియగుటచేత 1 వ పాదమునందలి యతిని విశ్వసించుటకు వీలులేదు. ఛందోభంగములేని రెండవపాదమునఁగూడ యతి గానరాదు. అందుచే నీపద్యమున యతిని నియమముగాఁ బెట్టుకొనలేదని చెప్పవచ్చును. నన్నయనాఁడుగాని నన్నయకుఁ బూర్వముగాని యతినిర్బంధములేకయే తెనుఁగుపద్యములు రచింపఁబడు నాచారము కలదేమో! యతినియమములేని కన్నడకవిత్వము భారతమునాఁడును భారతమునకుఁ బూర్వమునందును గూడ మిక్కిలి ప్రచారములో నుండుటచేత, తత్సాంప్రదాయ మొకప్పుడు తెనుఁగుకవితకుఁ గలిగినఁ గలిగియుండవచ్చును. కన్నడాంధ్రములు రెండు నత్యంతబాంధవ బంధురములుగదా? ఆంధ్రకవితకు నన్నయవలెఁ గన్నడకవితకుఁ బ్రసిద్ధపురుషుఁడును, నన్నయకు సమకాలికుఁడు నగు 'అభినవపంపా' యను కవీశ్వరుని పద్యమొకటి చిత్తగింపుఁడు. సంస్కృతపదాకలితంబగు నొక తెనుఁగుపద్యముతో నీకన్నడపద్య మెంతో భేదమును సహించియుండదు.

'మ. పరమబ్రహ్మ శరీరవృష్టి జగతాంతర్దృష్టి కైవ
ల్యబో, సరమామాత్రికహారయష్టి కవితావల్లీ సుధా
వృష్టి స, ద్వరసోత్పాదనవీనసృష్టి బుధహార్ద్రాకృష్టి
సర్వాంగసౌం, దరివిద్యానటనాటకం నలిగా మత్కా
వ్యస్థలీ రంగదోళ్.'

† Ind. Ant. Vol. 9, Page 103

కావ్యరచనావిధానము లనేకములు కన్నడమునుండి తెనుఁగులోఁ బ్రవేశించియుండ, మన తెనుఁగుకవు లాకప్పుడు కన్నడకవులవలె యతిని నిర్బంధముగాఁ బెట్టుకొనకయే పద్యములు వ్రాయుచుండిరనుటలో నాశ్చర్యముండదు. కాని కన్నడ కవితా ప్రసిద్ధినాఁడు తమిళ్కైతయును బ్రసిద్ధియందేయుండుటచేత నందలి యతినియమమును సైతమును గొంద ఱవలంబించుచు నుండియుందురు. ఇట్లు యతినియమమును బాటించికొందఱును బాటింపక కొందఱును గవిత్వ మల్లుచువచ్చుచుండ నన్నయరచించిన భారతముతో నియ్యతినియతి సంపూర్ణముగా నాంధ్రకవిత్వమునందు స్థిరపడినదిగాఁ గానవచ్చుచున్నది. మఱియు రాజనరేంద్రుఁడును రాజనరేంద్రుని తండ్రియుఁ గూడఁ జోళరాజులకు జామాతలు. ఆసందర్భమున రాజరాజనకుఁ జోళులతమిళకవితా విధానములతోఁ బరిచయము గలిగియుండవచ్చును. అందలియతినియమము వానికి నచ్చియుండవచ్చును. నచ్చి నన్నయముఖంబున భారతముగుండ నాంధ్రకవిత్వమునఁ జొచ్చి యందు స్థిరపడి యుండవచ్చును.

### నన్నయఛందో నియమములు

ఆంధ్రకవిత్వమున నస్థిరముగా సంచరించుచుండిన యీయతి నన్నయమూలమున స్థిరపడుటచే నియ్యతినిర్మాణకర్త నన్నయయే యని కొంద ఱందురు. నన్నయకు సమకాలికుఁడును, వానికి బహుదూరదేశము నందుండినవాఁడు నగు 'వనపతి'యను నొక సామంత ప్రభువు కళింగరాజ్యములో నరసన్నపేట తాలూకునందలి దీర్ఘాసి యను గ్రామమున వ్రాయించిన శాసనమునందు, నన్నయఛందోనియమములుగల సీసపద్యము వ్రాయఁబడియున్నది. నన్నయయే యీ యతినిర్మాణకర్తయనుటకు వీలుండదని సూచించుట కావద్యమిందుఁ బొందుపరుపఁబడినది.

దీర్ఘాసిలోని వనపతిశాసనము. శా. శ. 997-- క్రీ. శ. 1075.

"సీ. శ్రీశకవేండులు భూపతిపై శైల
నందాబ్జభవసంఖ్య నొంద, వేంగి,
దేశంబుఁ గిముడియుఁగోసల గ్రడిసింగి
దేశంబు మరి యొడ్డదేశమునఁగ
జనిన భూపాలుర నని నోర్చి చలమర్తి
గండఁడై నెగడిన మండలికుఁడు,
భూసురవంశుండు వాసవనిభభోగి
బణపతి సౌజన్య గుణయుతుండు,
దీర్ఘాసి భగవతిదేవి దేవాలయ
మున ముండటంగడు ఘనతరముగ
మండప మెత్తించె భండనవిజయుండు
గండగోపాలుం డఖండవర్తి
దీనియఁబట్టెఁ నద్దేవికి నవ్వలన్
దనమనోవల్లభ వనజనేత్రి
దీనియవెట్టెఁ బద్మావతి యినళశి
క్షోణులుంగల యంతకును మదమున
గగనభూమి చంద్రభురకరోదకశిఖి
మారుతాత్మమూర్తి మహిమమధన
యిష్టపూర్తిఫలము లెల్లకాలంబును
మెచ్చులొడఁ దమకు నిచ్చుచుండ."

ఆంధ్రకవిత్వమున 'ప్రసన్నకథా కవితార్థయుక్తి'ని గొందఱును 'అక్షరరమ్యతను' గొందఱును నాదరించుచున్నట్లు,

"సారమతిం గవీంద్రులు ప్రసన్నకథాకవితార్థయుక్తిలోఁ
నారసి మేలునా నితరు లక్షరరమ్యత నాదరింప.:."

అను నన్నయపద్యమువలనఁ దెలియుచున్నది. ఇట్టి సాహిత్యమతభేదములు విమర్శనములును వాఙ్మయము కేవలము శైశవమునందున్నప్పుడు కలుగనేరవు. అందుచే నన్నయనాఁటికే యాంధ్రకవిత్వము మిక్కిలి ప్రచారమునం దుండెననియుఁ దత్పూర్వపు టజ్ఞాతయుగము నిరాంధ్రయుగముగాదనియు నిశ్చితమగుచున్నది.

### చారిత్రకాజ్ఞాతయుగము

మన యాంధ్రకవిత్వ చరిత్రమునందు వలెనే హిందూదేశపు రాజ్యాంగచరిత్రమునందుఁగూడ నొకయజ్ఞాతయుగము గానవచ్చుచున్నది. పారంపర్యములైన కథల మూలమునఁగాని లిఖితరూపమునఁగాని యెట్టి నిదర్శనములునులేని యాయజ్ఞాతయుగమునందలి చారిత్రకాంశములను గనిపెట్టుటకై ప్రతిభావంతులైన మన చరిత్రకారులు నేఁటికిని బ్రయత్నించుచున్నారు. ఈవిషయములో వారికిఁ దోడగుచున్న యాధారములు పురాతనపుఁ గట్టడములు మొదలగు శిల్పములు (Architecture)మాత్రమే. లిఖితరూపకములైన యాధారములు లేనప్పుడు దేశమునందలి ప్రజలంగూర్చియు వారి మతముంగూర్చియు రాజ్యాంగ ప్రసంగములం గూర్చియుఁ గొంతవఱకైనఁ దెలియఁగలుగుట కీ శిల్పకళలే మార్గదర్శకములు. అజ్ఞాతయుగమునందలి చారిత్రకాంశసంపాదనకై యీశిల్పకళ లెట్లు సాయపడుచున్నవో యీక్రింది విషయములవలన స్పష్టముకాఁగలదు.

Dr- Fergusson says " In the rails of Buddha Gaya and Bharant, we have a complete picture of Buddhism as it existed during tne great Mouryan dynasty. (B.C. 320-B.C.180) At sanchi and the western caves we have as complete a representation of the form it took from the 2nd century B.C to 3rd century A.D. At Amaravaty and the Gandhara monasteries we learn what modifications had been introduced between our era and the third century and from the Ajanta and the later caves we trace its historv down-ward through its period of decay till it faded away altogether.

During the first half of this thousand years we have no contemporary records expect those written in stone and during the latter we have no books to rely upon; but the architecture with its sculptures and paintings remain and bear the indelible impress of the thoughts, the feelings and the aspirations of those who executed them and 'supply us with a vast amount of exact knowledge on the subject which is not available by any other means now known to us.

*  *  *  *

### బౌద్ధజైన చిహ్నములు

హిందూదేశమునందలి యుత్తరభాగములయందువలెనే మనయాంధ్రదేశము నందుఁగూడ బౌద్ధ జైనచిహ్నములు విచ్చలవిడిగాఁ గానవచ్చుచున్నవి. బహుదూరస్థములైనవి యే కాక, మన చుట్టుప్రక్కలనున్న, అమరావతి, పీఠికాపురము, బొజ్జనకొండ, రామతీర్థము మొదలగు పెక్కుస్థలములయం దిట్టి శిథిలాలయ చిహ్నములను నేఁటికిని మనము చూచుచున్నారము. *"అందు నమరావతి స్తూపమునందలి యొకచిన్న స్తంభముమీఁదఁ జెక్కఁబడిన కథయొక్క పట మీసంచికలో నీయఁబడినది. స్తంభమునకుఁబైని యొక

*లలితకళలు, కీ. శే. శ్రీ. వే. లక్ష్మణరావుపంతులుగారు ఎం.ఏ., ఆం.ప.సా.రుధిరోద్గారి సం॥ వైశా.బ.12 శనివారము,

శాసనమును, దానిక్రింద మకరతోరణమును, దానిక్రింద కమలమును, దానిక్రింద కథయు, దానిక్రింద మరలఁ బద్మమును జెక్కఁబడి యున్నవి. క్రిందిభాగము కొంతపగిలిపోయినది. రెండుకమలముల మధ్యఁ గల కథ యెద్దియని మనము పరీక్షింపఁగా నందలి ప్రతిమల హావభావాదికములవలన నీకథ గోచరించును."

"పై భాగమున నొకరాజు సింహాసనమున నాసీనుఁడై యున్నాడు. చారుడొకడు చేతులుజోడించుకొని యేదియో వార్త చెప్పుచున్నాడు. అతని యెదుటిభాగమునందు సైనికులు కోటను సంరక్షణసేయుచున్నట్లున్నారు. అంతకు క్రిందిభాగమున కోటద్వారమునుండి సైనికులు లోపలికి జొరబడుచున్నట్లున్నది. అందు నేనుఁగులు గుఱ్ఱములు పదాతులు గూడనున్నారు. క్రిందనొకఁడు శత్రుఁడు కాఁబోలును సాష్టాంగపడి శరణుజొచ్చినట్లు కానవచ్చుచున్నది. ఈవార్తయే పైని చారుఁడు రాజుతో చెప్పుచుండెగాబోలు. స్తంభముయొక్క క్రిందిభాగము పగులక యున్నయెడల నీకథయొక్క తదుపరివృత్తాంతము మనకు తెలిసియుండును."

"ఇంకొకపటము జూడుడు. ఇదియు నమరావతిలోనిదే. ఈబండపై భాగము కొంతపగిలినది. ఆపగిలిపోయిన వృత్తమునందు ఒకబౌద్ధ బోధకుఁడు స్త్రీపురుషులకేదియో బోధించుచున్నట్లును వారందరును భక్తిశ్రద్ధలతో వినుచున్నట్లును వారిపైని దేవగంధర్వులు పూజాద్రవ్యములను గొనివచ్చి యర్పించుచున్నట్లును గానవచ్చుచున్నది. బోధకునితల లేనందున నీతఁడు బుద్ధుఁడో బోధిసత్త్వుఁడో మరియెవఁడో తెలిసికొనుటకు వీలులేకుండ నున్నది. పైవృత్తమునకును క్రిందికమలమునకును నడుమనున్నపటములు మూడుగళ్లుగా విభజింపబడియున్నవి. మొదటిగదిలో నొక రాజు సింహాసనముమీద గూర్చుండినట్లును, ఒకయువకుడు భూమిమీద నాసనమువేసి కూర్చుండినట్లును, ఒకవీరుడు తనకేమియో చూపి వీరావేశసంభాషణము గావించుచున్నట్లును రాజు ఈసంభాషణము వినుచున్నట్లును జూపబడినది. రెండవగదిలో ఈసంభాషణముయొక్క ఫలము చూపబడినది. రాజొక యేనుఁగునెక్కి త్వరగా శత్రువులమీదికి బోవుచున్నాడు. అతనివెంట నిద్దరుస్త్రీలు మాత్రమున్నారు. శస్త్రములుకూడ లేవు. అతనివెంట సైన్యమువచ్చుచున్నది. ఆకాశమునుండి దేవగంధర్వులు పుష్పమాలలు వేయుచున్నారు. మూడవగదిలో వాయువేగమున బరుగిడుచున్న యశ్వములనెక్కి శత్రులు పారిపోవుచున్నట్లు చూపబడినది...
................................"

మతయుద్ధములు

ఈ గుఱుతులన్నియు మన దేశ మొకప్పుడు బౌద్ధజైన జనాక్రాంతమై యుండెనని చెప్పుట కవకాశము గలిగించుచున్నవి. అది నుండియు మన దేశస్థులకు మతమునందుఁ బ్రీతియుఁ బట్టుదలయు నెక్కువగదా? రాజకీయయుద్ధములవలెనే మతముతో సంబంధించినయుద్ధములుఁగూడఁ బూర్వము మన దేశమున జరుగుచుండెడివి. బౌద్ధ-జైన-శైవ-

వైష్ణవమతములు విజిగీషతోఁ జెలరేగి యాంధ్ర దేశమున నగ్రస్థానము వహించు టకై తమలోఁదాము నిరంతరమును గలహిం చుచుండెను. ఈమతయుద్ధములను దరుచుగా రాజులే నాయకులై నడపించుచుండెడివారు. దేశములో నొక్కొకకాలమున నొక్కొక మతము ప్రజలయొక్కయుఁ బ్రభువులయొ క్కయుఁ బ్రోత్సాహమును వహించి ప్రాధాన్య త్యమును బొందుచుండెను. ఈసందర్భమున జైనబౌద్ధమతముల నిర్మూలమును గూర్చి యాంధ్రులచరిత్ర మిట్లు చెప్పుచున్నది.

"బౌద్ధులకును జైనులకును ఘోరకల హము ప్రారంభమై మతచర్చ లతిభయంకరము లయ్యెను. మహారాజగు విష్ణువర్ధనుఁడు వైష్ణ వులపక్షమునఁ జేరినందున జైనులబల ముడిగి పోయినది. రామానుజుఁడు జైనమతాచా ర్యులను వాదమున గెలిచెనఁట. వైష్ణవపక్ష పాతియై విష్ణువర్ధనుఁడు 790 జైనదేవాలయ ములను నాశనముచేసి, యదివర కాదేవా లయముల పోషణార్థమై దానముచేసిన మడులు మాన్యములు నూడఁబెఱికికొని వైష్ణవదేవాలయముల కైంకర్యాదుల కొసం గెను..................... వైష్ణవమత మవలంబింపని జైన మతాచార్యు లనేకులు గానుగలలోఁ బెట్టి చంపఁబడిరి. పద్మ గిరిలోఁ దిరుగఁబడిన జైను లనేకులు పైరీతిగనే సంహరింపఁబడిరి. ఈ ఘోర ప్రళయమునకు భయపడి జైనమతావలంబకు లనేకులు తప్తముద్రధారణమును గైకొని వైష్ణవులయిరి. ఈవిషయములు స్థలపురాణ ములలోను వైష్ణవమత గ్రంథములలోను వ్రాయఁబడినవి............"

ఆంధ్రదేశముతో సంబంధించిన యిట్టి మత విషయములును రాజ్యాంగాది సకలవిష యములునుగూడ శిల్పచిహ్నములేకాక యంత కంటె నెక్కుడుగ గ్రంథజాలము పైతము మనకుఁ దోడగుచుండుటచేతఁ బదునొకండవ శతాబ్దమునకుఁ బూర్వముకంటెఁ దరువాత మన కెక్కువగా స్పష్టమగుచున్నవి. పదు మూఁడవ శతాబ్దమున గణపతిదేవుని నాఁడుఁ గూడఁ దిక్కనసోమయాజి కారణమునఁ బలు వురు జైనబౌద్ధులు సంహరింపఁబడిరని సోమ దేవరాజీయాది గ్రంథములవలనఁ దెలియు చున్నది.

### జైనుల యాంధ్రకావ్యరచన

ఇట్లు బౌద్ధులంగూర్చియు జైనులం గూర్చియు ననేకసంగతులు గ్రంథజాలమువల నఁదెలిసికొనుచు, వాని కుదాహరణములుగా జైనబౌద్ధశిల్పచిహ్నములను బెక్కుస్థలముల యందుఁ జూచుచున్నాము. రానురా నీరెండు మతములకును దేశమున నాశనము సంభవిం చుచువచ్చినను, కొన్నిశతాబ్దములు మాత్ర మీబౌద్ధులును జైనులును దమ మతప్రచార మునకై మనయాంధ్రులతో నేకీభవించి సర్వ విధముల వారితోఁ గలసిమెలసి సంచరించు చుండిరని పై నిదర్శనములేకాక యింకను బెక్కు చారిత్రకాంశములు చెప్పుచున్నవి. పెక్కు శతాబ్దములవఱకు నింతటి గాఢమైన సంబంధ మాంధ్రులతో వహించిన యీమతస్థు లకు, ఆంధ్రులవాఙ్మయముతోఁగూడ సంబంధ

ముండక తీరదు. అందుచే నియ్యుభయ మత బోధకులునుగూడఁ గన్నడాది భాషలయందు వలె నాంధ్రభాషయందును గొన్ని గ్రంథములు రచించియుండవలెను. ఇందుకు దృష్టాంతముగాఁ గంచిలో నేకజైన మతమునందుఁ దెనుఁగు జైన శతక మొకటి కలదని జైనగజేటు అధిపతులైన మ. రా. శ్రీ, సి. యస్. మల్లినాథుగారు చెప్పుచున్నారు.

### ఆంధ్రవాఙ్మయమునందు బౌద్ధయుగము, జైనయుగము

ఈ బౌద్ధ జైన మతబోధకులు గావించిన యాంధ్ర గ్రంథరచన యేయుగమునందు విచ్చలవిడిగా జరిగియుండునో యూహించుటయు మన కవసరము. ఇది సుకరమే కాని దుష్కరముగాదు. ఆంధ్ర వాఙ్మయోద్ధారకులలో నగ్రగణ్యులైన రాజరాజు విమలాదిత్యునివలెఁగాక, బ్రాహ్మణ మత ప్రతిష్ఠాపకుండై జైన మతవిసర్జనముగావించుట జైనులకెల్ల గొప్ప ప్రోత్సాహ భంగమనుటలో సందియము లేదు. "యథారాజా తథా ప్రజా" యను న్యాయమునఁ బ్రభువుననుసరించి ప్రజలకును నమ్మతమునం దసహ్యాభావము పుట్టియుండకపోదు. కావునఁ బదునొకండవ శతాబ్దమునందే జైనమతపతనమునకై యాంధ్రదేశమున నశుభసూచకము లారంభించెనని చెప్పవచ్చును. ఇయ్యపశకునములు కనుకూలముగ, బండ్రెండవ శతాబ్దమునందు * విష్ణువర్ధనునిచే నొకమారును, పదుమూఁడవశతాబ్దమున గణపతిదేవునిచే నైకమారును లోకభయంకరములైన బౌద్ధజైన సంహారములు రెండు గావింపఁబడినవి. అందు గణపతిదేవ్రఁ డీమతసంహారములో రాక్షసక్రౌర్యము వహించెనని చెప్పెదరు. మొత్తముపైఁ బదుమూఁడవశతాబ్దము రక్తసిక్త గాత్రములైన బౌద్ధజైనమతములకు సాయంకాలమని చెప్పక తప్పదు. ఈకారణములవలన 11-12-13 వ శతాబ్దములలో నీమతములు క్రమక్రమముగా నశించినవనియే చెప్పవలసియున్నది. కావున నన్నయకుఁబూర్వపు టజ్ఞాతయుగమునందే మనయాంధ్రదేశమున బౌద్ధులును జైనులునుకూడ గొప్పయున్నతి వహించియుందురు. ఆయుగమునందే వారికి మిక్కిలి యాంధ్ర జనాదరణము కలిగియుండును. మత ప్రచారమునకై వారుగావించిన యాంధ్ర గ్రంథరచనయు నప్పుడే విచ్చలవిడిగా జరిగియుండును. ఈయజ్ఞాతయుగమునందే బౌద్ధయుగమనియు, 'జైనయుగ' మనియు మన యాంధ్ర వాఙ్మయముతో సంబంధించిన రెండు యుగము లుండియుండవలయును.

ఇంక 11 వ శతాబ్దము ప్రారంభముగాఁ గల వాఙ్మయము నంతటిని మన మెట్లు యుగవిభాగ మొనర్పవలయునో విచారింతము. భారతయుగము నాఁటి వాఙ్మయ స్థితికిని, ప్రస్తుతయుగమునందలి వాఙ్మయస్థితికినిగల తారతమ్యములను బరిశీలించిన యెడల నీ రెండింటికిని నడుమంగల యుగములలో నాంధ్ర కవిత్వ మెన్నిరూవిధములైన మార్పులను

* క్రీ. శ. 1106 లో రాజ్యాధిపత్యము వహించిన గాంగవాడి దేశాధీశుఁడగు విశలదేవరాయని కీవిష్ణువర్ధనుఁ డనునది క్రొత్తపేరు.

జెందియుండవలయు నని స్ఫురింపఁగలదు. ప్రస్తుతయుగ మనఁగా 19 వ శతాబ్దమునుండియుఁ బ్రారంభమైన నవీనయుగమని నాయభిప్రాయము. ఈ నవయుగములోని వాఙ్మయము పూర్వయుగములలోని వాఙ్మయము నుండి పెక్కువిధముల భేదించుచున్నది. ఆభేద మొకటిరెంటిలో మాత్రమే కాదు. కావ్యరచనోద్దేశములు, కావ్యరచనావిమర్శలు, కావ్యరచనావిధానములు, కావ్యరచనాస్వాతంత్ర్యములు, కావ్యరచనాసంపాదితవస్తుసామగ్రులు, (Materials) కావ్యకర్తల జీవనోపాధులు, కావ్యకర్తల సంరక్షకులు, కావ్యకర్తల పాండిత్యవిశేషములు, ఇట్లనేక విషయములయందనేకవిధములైన మార్పులు గానవచ్చుచున్నవి.

### పూర్వయుగములలోని కవులు

పూర్వ యుగములలోని కవులెల్లరుఁ బ్రాయికముగా బ్రాహ్మణులే. కవియన నెట్టివాఁడో నిర్వచించిన యప్పకవి కవి కుండవలసిన యోగ్యతలలో బ్రాహ్మణత్వమే మొదటిదిగాఁ జెప్పినసంగతి మన మిదివఱకుఁ జర్చించితిమి. ఇదమిత్థమని నిశ్చయించుటకు వీలు లేక యింకను సంశయాస్పదములై యున్న చేమకూర వేంకటకవ్యాదుల విషయము లటుండ, రంగనాథుఁడు, కాచవిభుఁడు, నన్నెచోడుఁడు, రాయలు, భట్టుమూర్తి, కంసాలి రుద్రయ్య, మొల్ల, కోటశివరామయ్య (పెద ధూర్జటి శిష్యుఁడు), మల్లారెడ్డి, రామరాజు, రంగప్ప, మట్ల అనంతభూపాలుఁడు, వైచ రాజు వేంకటనాథుఁడు, ముద్దుపళని మొదలగు బ్రాహ్మణేతరకవులు కొందఱు మాత్రమే పూర్వయుగములలో లెక్కకుఁ గానవచ్చుచున్నారు. ఈనవయుగమునఁ గవితావిద్య యొకరిసొమ్ముగాక వరణీయులగు సకలవర్ణములవారిచేతను నభ్యసింపఁబడుచున్నది. పూర్వయుగములో బ్రాహ్మణేతర కవిత్వమును బ్రాహ్మణు లధిక్షేపించుచుండిరేమోయని యీ క్రిందిపద్యమువలన నూహింపఁదగియున్నది.

క. "చీపర పాపర తీఁగలఁ
జేపలఁబట్టినట్లు చెప్పిన నీయా
కాపుఁగవిత్వపు మాటలు
బాపనకవివరుని చెవికిఁ బ్రమదంబిడునే!"

ఈనవయుగమున బ్రాహ్మణ కవిత్వము బ్రాహ్మణేతర కవిత్వమును సమానముగానే ప్రకాశించుచున్నవి. అమాత్యసేనానాయకాద్యున్నతోద్యోగములతోఁ గొందఱును కేవల కావ్యరచనోద్యోగముతోడనే కొందఱును బూర్వయుగములలోని కవులు సాధారణముగా రాజాస్థానములనే యంటియుండిరి. అట్టి యున్నతోద్యోగములు లేకపోవుటయే కాక కవితారచనచేఁ గవులు పోషింపఁబడుచుండిన యాస్థానములు ప్రస్తుతయుగమున లెక్కకు మిక్కిలి తక్కువ. వేములవాడ భీమకవి, శ్రీనాథుఁడు, అడిదము సూరకవి మొదలగు కవులయొక్క చరిత్రములవలనఁ బూర్వయుగములలోని కవులు కొందఱు శాపానుగ్రహసమర్థులనియు నాకారణమున రాజులట్టి కవులయెడ భయభక్తులుగలిగి వారినెల్లప్పుడును సత్కరించుచుండిరనియుఁ దెలియుచున్నది. కాని శాపానుగ్రహసమర్థతయొక్కటే కారణము గాదు. సాధారణముగఁ బూర్వపు

రాజులకుఁ గవితాభిమానము సహజగుణము. అందుచేఁ గవులెల్లరునుగూడ సాధారణముగా రాజులచేఁ బోషింపఁబడుచుండిరి.

### కవులు - దారిద్ర్యము

మఱియుఁ బూర్వయుగములలోని కవులు దరిద్రులనియు నందుచే నానారాజ సందర్శనము లాచరించుచు జీవించుచుండిరనియు వాడుక; కాని వాఙ్మయమున గణింపఁదగిన కవులలో నట్లు దేశాటనమువలన జీవించిన కవులు మిక్కిలి తక్కువయేమో యని చెప్పవలసి వచ్చుచున్నది. భీమకవి జీవితచరిత్రాంశములు మన కింకను తెలియవు. అవసానదశయం దొకప్పుడు కొన్నికష్టములు సంభవించినట్లు తోఁచుచున్నను, శ్రీనాథునిజీవితముమాత్రము మొత్తముపై సుఖాస్పదమైన దేకాని దారిద్ర్యపీడితము గాదు. రెడ్డిరాజులచే నాతఁడు పోషింపఁబడిన విధమును రాజాస్థానములయం దాతఁడు చెప్పిన పద్యములను బట్టిచూడ, దేశాటన మొనర్చుటయందలి శ్రీనాథుని యభిప్రాయము దిగ్విజయమేకాని యుదరపోషణముగాదని స్ఫురింపఁగలదు. శ్రీనాథుని వలెనే యడిదము సూరకవి సైతమును దన జీవితములోఁ గొంతకాలమును నానారాజ సందర్శనములతోఁ గడపెను. సూరకవి విజయరామ గజపతీంద్రుని యాస్థానకవి. ఆతఁడు సందర్శించిన రాజులు బొబ్బిలిరంగారాయఁడు, వల్లాకిమిడి నారాయణదేవుఁడు మొదలగువారు. వారిలోఁ గొందఱు విజయరామ గజపతికి శత్రువులు; కొందఱు మిత్రులు. అట్టి రాజుల నీతఁడు సందర్శించుటకుఁ గారణము తన ప్రభువుతో సంబంధించిన రాజకీయ వ్యవహారమేదైనఁ గావలసియుండును గాని కేవలము 'భిక్షాం దేహి' యని యాచించుట గాదని నాయూహ. అదియునుగాక సూరకవి కొంతభూవసతియుం గలవాఁడు. తన కనకాభిషేకమునాఁడు "స్నానముచేసెననీరు పానము సేయు" నని వేలకొలఁది బంగారునాణెములను బరిత్యజించిన మహోదారచిత్తుఁడు. ఆత్మగౌరవమునకై యొక్కొక్కప్పుడు తన ప్రభువునుసైతమును నిర్లక్ష్యభావమునఁ జూచుచుండువాఁడు. అట్టి సూరకవి పట్టిదరిద్రుఁడనియుఁ బొట్టకూటికొఱకే రాజుల సందర్శించుచుండెననియుఁ జెప్పుట న్యాయముగాదు.

### నవీనయుగకవులు - కావ్యరచన

ఇంక నీనవయుగములోని కవులన్నచో శాపానుగ్రహసమర్థులని చెప్పుటకు నిదర్శనములులేవు. కవితాభిమానులై, వచ్చినకవులను సత్కరించురాజులును మిక్కిలితక్కువ. అందుచేఁ గవులదేశాటనములు నానారాజ సందర్శనములు నీయుగమున నంతగాఁ గానరావు. కొందఱుకవులు స్వతంత్రకావ్యరచన మొనర్చినను బూర్వకవులు సాధారణముగాఁ బ్రభువులనుమెప్పించు కావ్యరచన గావించుచుండిరి. ప్రస్తుతకవులలోఁ బ్రజలను మెప్పించు కావ్యరచన గావింపవలసిన వారగుచున్నారు. ప్రభువు తనయాస్థానమున విద్వజ్జనముల మధ్య నొకానొక కావ్యమును సాంతముగా విని, తత్కృతిపతిత్వ మంగీకరించిన పిమ్మట నయ్యది సుప్రసిద్ధకావ్యముగా నెన్నఁబడుచుఁ గ్రమక్రమముగఁ బ్రచారములోనికి వచ్చు

చుండెను. కాని ముద్రణాది సాధనములు లేని యాకాలములో నెంతటిసు ప్రసిద్ధగ్రంథమైనను బ్రస్తుతయుగమునందువలె నంతశీఘ్రముగా దేశమున వ్యాపించుట కవకాశములు చాలకుండెను. భారతరామాయణాది మహాగ్రంథముల సైతము నెవరి ప్రతులను వారు వ్రాసికొనవలసినవా రగుచుండిరి. కాని మన కిప్పటట్టి చిక్కులు లేవు. అట్టి చిక్కులే కాక యెట్టి చిక్కులును లేవు. ప్రభుమతము ననుసరించి యాతని మెప్పువడయు కావ్యరచన గావింపవలసిన నిబంధనమూ లేదు. రచించిన కావ్యము రంగారోహణమున విద్వజ్జనామోదమును బొందవలయు నగత్య మంతకన్నను లేదు. సాధారణముగఁ బ్రస్తుతకావ్యకర్తలు మంచిచేసికొని యాశ్రయింపవలసిన వా రిరు పురుషమాత్రమే: వ్రాసినగ్రంథమును నుచితముగాఁగాని తక్కువధరకుఁగాని యచ్చువేసి యిచ్చుటకొకముద్రాయంత్రాధికారి (Printer); ముద్రించినగ్రంథమును బఠనీయగ్రంథముగా నేర్పరచుట కొక పఠనీయగ్రంథనిర్ణయసభాసభ్యుఁడు (member of the text book committee) ప్రభుసమాదరణములేని యీదినములలో నియ్యిరువురి సాహాయ్యముచేతనే కావ్యకర్తలు కాలక్షేపము చేయవలసినవా రగుచున్నారు. ఇట్లని యీనవయుగాంధ్రకావ్యకర్తలకుఁ గావ్యరచనమున విద్వజ్జనామోద మవసరములేదని నాయభిప్రాయము గాదు. ముద్రితగ్రంథములయందలి యుపోద్ఘాతములలో "మిత్రుల ప్రోత్సాహమువలన నేనీగ్రంథము నింతత్వరగా ముద్రింపవలసి వచ్చిన"దనియు, "కావున విద్వజ్జను లిందలి దోషము లెఱింగించినయెడ రెండవకూర్పునందు దిద్దుకొనెద" ననియు గ్రంథకర్తల విన్నపములు మనము తఱచుగాఁ జూచుచుండుటచేత నట్లు భావించుటకు వీలులేదు.

మఱియొకవిధముగా మనము పరిశీలించినయెడఁ బూర్వయుగములలోని కవులకంటె నీ నవయుగాంధ్రకవులకుఁ గావ్యరచనయందెక్కుడు నిరుత్సాహము, కష్టము, మానసికాందోళనము, భయము గలుగుచుండునని చెప్పవలసి వచ్చుచున్నది. సంస్కృతమునుండి యాంధ్రీకృతములుగాక శేషించినకావ్యములో, లేక తమ ప్రభువులు ప్రత్యేకముగాఁ దమకు రచింప నియోగించిన కావ్యములో, పురాణమనికాని, ప్రబంధమనికాని, ద్వ్యర్థికావ్యమనికాని పూర్వకవులు తమతమ యుగములనాఁటి రచనాసాంప్రదాయముల ననుసరించి నిశ్శంకగా రచించుచుండిరి. ఈనవయుగమునఁ గవులకావ్యరచన కట్టి రాజమార్గ మొకటి యేర్పడియుండలేదు. పూర్వసాంప్రదాయము పూర్తిగఁ బోవకుండుటయు, నాంగ్లభాషా సహవాసంబున నూతనసాంప్రదాయ మొకటి బయలుదేరుటయుఁ దటస్థించుటచేత నీసాంప్రదాయ ద్వంద్వము రోగులను వైద్యద్వంద్వమువలెఁ గవులనెంతయు బాధించుచున్నది. అందుచే రచనోత్సాహముగల కవి, కావ్యనిర్మాణమునకుఁ గడంగుటకు ముందుగ నీరెండుసాంప్రదాయములలో నెద్దాని ననుసరింపవలయునో యని కొంత మానసికాందోళనము

నొందుచుండును. ఒకపురాణమా, ప్రబంధమా, లేక, నాటకమా, ప్రహసనమా, నవలయా, ఎయ్యది రచించినయెడల నెక్కుడుగఁ బ్రజ లామోదింతురో, ఎట్టిరచన మెచ్చినఁ బఠనీయగ్రంథముగా నిర్ణయింపఁబడునో యని రాజాదరణములేక కేవలము ప్రజాదరణముపైనే బ్రదుకుచుండిన యీ నవయుగాంధ్రకవి వితర్కించుట యెుక వింతగాదు.

సామాన్యకవులు - వారికావ్యములు

ఇది యిట్లుండ నీనవలలు, నాటకములు, ప్రహసనములు, గావ్యములుగాఁ బరిగణింపఁబడునా యనియు వానిని రచించినవారును గవులనఁబడుదురాయనియుఁ గొందఱు పరిహసింతురు. గీర్వాణకవులెల్లరును గాళిదాసులుకారు. ఆంగ్లేయకవులెల్లరును షేక్స్పియరులుకారు. అట్లే యాంధ్రకవులెల్లరును నన్నపార్యులు కాఁజాలరు. ఏభాషయందలి కవిత్వచరిత్రమును మనము పరిశీలించినను సాధారణముగ నొక్కొక్క యుగమునందొక్కొక్కమహాకవి కవులకెల్లరకును మార్గదర్శియై ప్రబలుచుండును. ఆయాయుగముల యందలి తదితర సామాన్యకవులను వారి కావ్యములను గవులనియుఁ గావ్యముల నియు గణింపకున్నయెడల, నింక మహాకవులనియు మహాకావ్యములనియు నిర్ణయింప వలసిన యవసరమే యుండదు. అందుచే సామాన్యకవులును సామాన్యకావ్యములును మహాకవులకును మహాకావ్యములకును గీర్తి సాధనములగుకతన, మనకవిత్వ చరిత్రము నందట్టికవులను గావ్యములను గూడఁ బ్రసంగించుట యవసరమని నావిన్నపము.



## * వర్షాగమము

పింజమూరి రంగాచార్యులు గారు, ఎం. ఏ., బి. యల్.

జలబిందువులతోడి జలధరంబుల గుంపు, శోభగొందు మదపుశేషుఁగులు గాఁగ
ధళధళలుక్కువ నింగిఁ దాటించు మెఱపులు, రమణీయమైన యెక్కెములుగాఁగ
అవనిఁగ్రక్కదలెడు నశని ఘోషంబులు, తోరంపు విజయదుందుభులుగాఁగ
చెలువొందు తొలకరి చిఱుపాటచినుకులు, నాచార లాజ వర్షంబు గాఁగ
రమ్యకాంతులతో మహారాజువలెను, వచ్చెఁ బ్రియురాల! చూడు మిప్పట్టునందు
కామిజనముల పాలిటి నోముపంట, అతులరమ్యంబు నూత్నవర్షాగమంబు. ౧

గీ. పల్లకల్వల కాంతి నందముగఁ గొన్ని, కరము నున్నకాటుకవోలె మెఱసికొన్ని,
నిండుచూలాలి గుబ్బపాలిండ్ల మిసిమిఁ గొన్ని, యాకాశమెల్ల మొయిళ్ళగములె!. ౨

* ఆంధ్రగబుతుసంహారమునుండి.

తరకల్పన చేయవలసి ఉంటుంది. కనుక, నేను చెప్పిన దేమంటే, మహాక్కరలో పాదాదినుండవలసిన సూర్య గణము రెండవగణముగా నైనా నాలవగణముగా నైనా ఉండవచ్చునన్న వికల్పము కలదుగదా; అట్లే ఈమధ్యాక్కరలో కూడా కవికి స్వాతంత్ర్య ముండదేమో. ఇదీ నేను వ్రాసినది. అయితే, ఇప్పుడు సీతారామస్వామి శాస్త్రులవారు చూపించిన వాక్యములను బట్టి యథేష్టముగా ఉండవచ్చునని నేను చెప్పిన విశేషలక్షణమే సామాన్యలక్షణముగా నేను గ్రహించినట్లు చదివేవారికి అర్థమవుతున్నది.

నావద్దనున్న అచ్చుప్రతినుండి స్వమతోపయోగములకు కొన్నియక్కరల చరణములను వెదకి తీసి యుదాహరించినానని శాస్త్రులవారు వ్రాసినారు! నేను చూచిన నాలుగైదు వ్రాతప్రతులలోను, అచ్చుపడ్డప్రతుల యందు కొన్నిటిలోను, ఆపాఠములు కనిపించుచుండుట చేత అవి నన్నయపాఠములే అయిఉండుననుట తప్పు కాదని నేను స్పష్టముగా వ్రాసిఉన్నానుగదా; శాస్త్రుల వారు ఈ వాక్యములు సరిగాచూడలేదో! చూచినా, నామాటలయందు విశ్వాసములేక నావద్దను తాటాకు ప్రతులు ఉండవని తలచినారో!

ఈ 80 వ పుటలోనే శాస్త్రులవారుచేసిన ఆక్షేపణము మరియొకటున్నది. ఇందాక చదివినదానికి అసల సన్న పేరాలో గుర్తుపెట్టినవాక్యములు చదవండి.

సూర్య:—"ముద్రణకర్త లప్పకవీయమునుబట్టి సవరింప తలంపుగలవారేయైనను వీరి కుపచరించిన యీయాయలం స్థలములలో ప్రమాదవశమున గిడలిపడి సవరణము లను చేయుటలోఁ బొరపడి యుందురని నానమ్మకము అట్టివానినే ప్రమాణముగాఁజేసికొని లక్షణాంతరకల్పనము చేయఁగడంగుట సాహసమని నా యభిప్రాయము".

నేను:—ఆగండి; ఇందులో సాహసము చూపినవారు ఎవరో మీకే స్పష్టమవుతుంది. అచ్చుప్రతిలోనే కాక, నేను చూచిన నాలుగైదు వ్రాతప్రతులలోను కూడా ఆపాఠములు నాకు కనబడినవని నేను స్పష్టముగా వ్రాసిఉండగా, వీటిని తాము గ్రహించుటకు ఇష్టపడక, సీతారామస్వామిశాస్త్రులవారు ఎట్లు ఊహించినారో చూచినారా! అప్పకవీయమును బట్టి సవరించు తలంపుగలవారేయైన, ముద్రణకర్తలు అప్పక వీయమందలి లక్షణమునకు విరుద్ధముగా దిద్ది సవరించి ఉండరుగదా! అయితే, ఈపాఠము లెందుండి వచ్చినవి? వ్రాతప్రతులనుండి వచ్చినవే కావలెను. అవిదిద్దుటకు వీలులేక పోవుటచేత వాటిని దిద్దకుండా ముద్రణకర్తలు అచ్చువేయించి ఉండవలెను; లేదా, దిద్దుటకు వీలు పడినా, అవి తాము గ్రహించిన లక్షణమునకు సరిగా ఉన్నదీ లేనిదీ చూచుకోకుండా ప్రమత్తులయి వ్రాత ప్రతులలోని పాఠములు అచ్చువేయించి ఉండవలెను. ఏదిట్లయినా, ఆపాఠములు కొన్నివ్రాతప్రతులలో ఉన్నవి; నేను చూచినాను. అవి నన్నయ వాగ్వ్యవహారమునకు విరుద్ధముగా లేవని మనకు తోచినప్పుడు వాటిని సుప్రమాణముగా గ్రహించి వాటికి లక్షణము కల్పించడమే సాహసమో, ఎవరూ చెప్పని గణములు సూర్యేంద్రచంద్రగణములుగా గ్రహించి, ఏవనకమునకైనా సరిపడుతూఉన్న గణలక్షణము నన్నయ మధ్యాక్కర పాదములకు సరిపడదని చెప్పడమే సాహసమో మీరే ఆలోచించి చెప్పండి. ఇకను, తర్వాతి వాక్యము చదవండి.

సూర్య:—"మరియు మీరు స్వపక్షోపయోగము లనుకొన్న యీచరణము లితర తాళపత్రగ్రంథములలోను, నితర ముద్రణములలోను మీరుదహరించిన రీతినుండక యప్పకవీయాది ప్రసిద్ధలక్షణమునకే లొంగి యున్నవి."

నేను:—అటువంటి పాఠములు దొరికినయెడల నాకు చాలా సంతోషమే. పూర్వులు గ్రహించిన లక్షణమునకున్ను నన్నయ వాగ్వ్యవహారమునకున్ను అనుగుణమైన పాఠములు కనబడినప్పుడు ఇంక కావలసిన దేమి? అప్పుడు నేను చెప్పిన విశేషలక్షణము పరిత్యజించవలసినదే; సీతారామస్వామి శాస్త్రులవారుకూడా తాము అనవసరముగాను, నిరాధారముగాను తెచ్చిపెట్టిన గణలక్షణము విడిచిపెట్టు కోవలసినదే. అప్పకవ్యాదిలాక్షణికులు చెప్పిన లక్షణమే సరియైనలక్షణమని అంగీకరించవలసినదేకదా! అయితే, మనదురదృష్టముచేత, పూర్వలాక్షణికులు,

